# నీతిపద్యరత్నావళి.





ఇది

వలివేటి శ్రీమన్నారాయణమూర్తిచే

శ్రీభాగవతాద్యుద్గ్రంథములనుండి నొకచోఁ జేర్పబడి

గుంటూరు చంద్రికా ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడి ప్రచురింపబడెను.

(వెల రు. 0—4—0



ఓం.

శ్రీమత్పరదేవతాయైనమః.

# నీతిపద్యరత్నావళి

(మొదటి భాగము)

మ॥ కలలోనందను మున్నెఱుంగని మహాకష్టాత్ముఁడైనట్టిమ
ర్త్యుఁడాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబులుల్లంబులోఁ
దలఁపన్నంతన మెచ్చి యార్తిహరుఁడై తన్నైన నిచ్చున్ సుని
శ్చలభక్తిన్ భజియించువారికిడఁ దే సంపద్విశేషోన్నతుల్॥

సీ॥ ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ
గరుణాలవాలు భాసురకపోలుఁ
గౌస్తుభాలంకారుఁ గామితమందారు
సుమచిరలావణ్యు సురశరణ్యు
హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయానుఁ గౌశేయపరిధానుఁ
బన్నగశయను నబ్జాతనయను

తే॥ మకరకుండల సద్భూషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణురోచిష్ణు జిష్ణుసహిష్ణుఁ గృష్ణు॥ 2

సీ॥ కమలాక్షునర్చించు కరములు కరములు
శ్రీనాథువర్ణించు జిహ్వజిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతువలగొను పదములు పదములు
పురుషోత్తమునిమీఁది బుద్ధి బుద్ధి

తే॥ దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి హరిఁ జేరు మనియెడి తండ్రి తండ్రి॥ 3

సీ॥ కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే
పవనగుంభిత చర్మభస్త్రి గాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి ఢక్క గాక
హరిపూజనములేని హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మిత దర్వి గాక

కమలేశుఁ జూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రంధ్రములుగాక
ఆ॥ చక్రిచింత లేని జన్మంబు జన్మమే
తరళసలిల బుద్బుదంబుగాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడి పశువుగాక॥ 4

సీ॥ మందారమకరందమాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీ వీచికలఁదూఁగు
రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాలపల్లవ ఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా స్ఫురితచకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు
తే॥ నంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు,
వినుతగుణశీల మాటలు వేయునేల॥ 5

కం॥ ఇందుఁ గలఁడందుఁ లేఁడని
సందేహమువలదు చక్రిసర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన,
నందందే కలఁడు దానవాగ్రణి వింటే॥ 6

ఉ॥ ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపలనుండు లీనమై
యెవ్వనియందుడిందుఁ బరమేశ్వరుఁడెవ్వఁడు మూలకారణం
బెవ్వఁడనాదిమధ్యలయుఁడెవ్వఁడు సర్వముఁదానయైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్ ॥7

కం॥ కలఁడందురు దీనులయెడఁ
గలఁడందురు పరమయోగిగణములపాలం
గలఁడందు రన్నిదిశలను,
గలఁడు కలండనెడు వాఁడు గలఁడో లేఁడో॥ 8

సీ॥ కలుగఁడే నాపాలికలిమిసందేహింపఁ
గలిమిలేములు లేక కలుగువాఁడు
నాకడ్డపడరాఁడె సలినసాధువులచేఁ
బడిన సాధులకడ్డపడెడువాఁడు
చూడఁడే నాపాటుఁజూపులఁ జూడక
చూచువారలఁ గృపఁజూచువాఁడు
లీలతో నామొఱాలింపఁడే మొఱఁగుల
మొఱలెఱుఁగుచు దన్ను మొఱఁగువాఁడు
తే॥ అఖిలరూపముల్ దనరూపమైనవాఁడు
ఆదిమధ్యాంతములు లేక యడరువాఁడు
భక్తజనముల దీనుల పాలివాఁడు
వినఁడెచూడఁడె తలఁపఁడే వేగ రాఁడె॥ 9

శా॥ లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ
ప్రాణంబులున్

తాఁపుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువుల్ డస్సెన్
శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితఃపరంబెఱుఁగమన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా॥ 10

ఉ॥ ఓ కమలాప్త యోవరద యో ప్రతిపక్షవిపక్షదూర కు
య్యో కవియోగివంద్య సుగుణోత్తమ యోశరణాగతామరా
నోకహ యో మునీశ్వరమనోహర యోవిమలప్రభావరా
వేకరుణింపవే తలఁపవే శరణార్థి నినన్నుఁ గావవే॥ 11

చ॥ హరిపరమాత్మ కేశవచరాచర భూతశరీరధారివై
బరఁగుచునీవు నిట్టులుగఁ బ్రాణనిరోధ మెరుంగమెందు ముం
దిరవుగ దేవదేవ జగదీశ్వర సర్వశరణ్య నీపదాం
బురుహము లర్థిమై శరణువొందెద మార్తిహరించికావవే॥

కం॥ నీయంద సంభవించును
నీయందవసించియుండు నిఖిలజగముల్
నీయందలయముఁ బొందును
నీయుదరము సర్వభూత నిలయము రుద్రా॥ 13

కం॥ మ్రింగెడువాఁడు విభుండని
మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ
మంగళసూత్రింబునెంత మదినమ్మినదో॥ 14

సీ॥ నీవపావకుఁడవు నీవసూర్యుండవు
నీవచంద్రుండవు నీవజలము

నీవనేలయు నింగి నీవసమీరణంబు
నీవభూతేంద్రియనికరమీవ
నీవబ్రహ్మంబును నీవసత్యంబును
నీవయజ్ఞంబును నీవఫలము
నీవలోకేశులు నీవసర్వాత్మయు
నీవకాలంబును నీవజగము

తే॥ నీవుబహుయజ్ఞభోజివినీవనిత్య
మూలతేజంబు నీకు నే మ్రొక్కువాఁడ
నీరజాక్షుండు చాలమన్నించునట్టి
శత్రుముఖ్యమకావవే చాలుమునిని॥ 15

చిరకారియను ముని కుమారుని చరిత్రము.

క॥ అతఁడు చిరకాలసువిచా
రితంబుగాఁజేసి యాచరించుఁగురుభూ
పతివర్య యెద్దియును నది
గతముగఁ జిరకారినామకంబునఁ బరగున్॥ 16

సీ॥ వినుమొక్క కారణంబున ముని పత్నిపైఁ
గోపించి చంపనకొడుకుఁ బనిచి
యెటయేని వెడలిపోవుటయును బనులెల్లఁ
జిరవిచారముతోడఁ జేయుఁగాన
యచ్చిరకారి యిట్లని విచారించె జ
నకుపంపుసేఁత మానంగరాదు

తల్లిఁజంపుటయును దగదు తండ్రిదలంపు
దప్పింతుఁగాకని తలఁతునేని

తే॥ గల్మషంబందుఁ ద్రిదాని సత్కర్మవిధులు
మాతృరక్షగ ర్తవ్యమెమ్మాడ్కినైనఁ
బుత్రభావమస్వాతంత్ర్యమునకు నెలవు
పాపమడఁగింప నెవ్వలనోపునొక్కొ॥ 17

కం॥ జననీవధంబు సేసిన
ననుమానమె నరకమగుటయని యడిగితిఁబో
జనకావమాన మొనరిం
చినవానికి నరకమున వసింపఁగవలదే॥ 18

తే॥ తల్లిభర్త్రిక బీజంబు తండ్రివెట్టు
వంశధరణార్థముగ నిది వారిభంగి
యేనుబాత్తుల వాఁడ నయ్యేసుపురకును
వీరలందిప్పు డెవ్వరి విడుచువాఁడ॥ 19

వ॥ అని విచారించి తలంచుకొని॥ 20

కం॥ జనకుఁడయేనె జన్మిం
చినవాఁడను జనకుపంపుసేసినఁ బాయుం
దనయుని పాపములసియును
వినియుందుదుఁ దలఁపులింక వేయును నేలా॥ 21

కం॥ జనకుఁడు దపమునుధర్మం
బునువిద్యయుఁ బరమదైవమునుగావున నా

తనికిఁ బ్రియంబగుపని సే
సిన దేవతలెల్లఁ బ్రీతిఁ జెందుటగల్గున్॥ 22

వ॥ అని వితర్కించియుఁ దల్లి తెఱంగుఁదలంచి॥ 23

చ॥ కరచరణాది సంఘటిత కాయము సంజననంబువహ్ని పు
ట్టరణికిఁబోలెఁ దల్లి దెసనైనది గాదొకొ యట్లుఁగాకదు
ర్భరమగు గర్భఖేదమును బట్టికినై నిజదేహచింతపై
భరమొకయింత లేకపడుపాటులుఁ నక్కట యెక్కుడింతకున్॥

ఆ॥ వచ్చిపోయి చూచునాఁడు గాకిడుములఁ
బడునె తల్లి వ్రాలెఁ బట్టితోడఁ
దండ్రి చెప్పనిట్లు ధర్మశాస్త్రంబులు
నంబ గౌరవమున నధికయగుట॥ 25

ఆ॥ బాలుఁడైన కొడుకు ప్రౌఢుఁడైనను వృద్ధు
డైననొక్క విధమయర్మిలియును
నరయుభరముఁ దల్లి కాపదార్ధంబుజ
గంబుకలిమికెల్లఁ గారణంబు॥ 26

ఆ॥ క్షుద్రజంతువులకు గురులకునెమ్మెయిఁ
దలఁపనొక్క రూపతల్లి వలయు
నూఱడిల్లఁగలదె యొండుపోటుఁ సువ
స్తువునివాసమైనచోటఁగాక॥ 27

కం॥ అప్పుడయసమర్థుండగు
వప్పుడ దుఃఖయగు శూన్యమైతోఁచుజగం

బప్పుడ మాతృవియోగం
బెప్పుడువాటిల్లె నపుడయెంతయుఁదూలున్॥ 28

కం॥ కలవాఁడు లేనివాఁడు స
బలుఁడబలుఁడు మూఢబుద్ధి ప్రౌఢుండనఁగా
వలదెవ్వరికైనజనని
కలిమియయత్యంత సౌఖ్యకరమైయుండున్॥ 29

తే॥ ఇట్టిజనని వధించుట యెల్లభంగి
నధికపాపపయోరాశియందుముంచు
దీని నెఱుఁగండెపసులవాఁడైన వధకు
నేలతెంపువాటిలుఁ జేతులెట్టులాడు॥ 30

వ॥ అని యిట్లు పెక్కుభంగుల నూహించుచుఁ జిరకా
రియగుట నతండు శీఘ్రకారిగాక యుండం దడ వెంతయేనియుం
గలిగె నంతకుం దదీయజనకుండు॥ 31

కం॥ వెడపనికివాలిఁ జంపం
గొడుకుఁ బనిచినచ్చినాఁడ గ్రూరత్వమునం
గడవంబడునొక్కొ పనియని
కడువెసఁజనుదెంచె నశ్రుకణములు దొరఁగన్॥ 32

వ॥ అట్లు నను దెంచు నప్పుడు॥ 33

కం॥ చిరకారియెట్లునుం దన
చిరకారితఁ జూపుఁగాక శీఘ్రపుఁజేతఁ
దురటిల్లఁ జేయునేనను
వెరవరివాఁడిట్టిపనికి వేగిరపడునే॥ 34

వ. అనిపుత్రునుద్దేశించి, 35

చ॥ చిరముగ గర్భవాసమునఁ జెందితిపుత్ర చిరంబుగాఁగ ని
న్నరసెఁగదయ్య తల్లియనయంబును నేఁబనుపంగఁబూని
యుం
జిరమగునట్టి యిత్తెఱఁగు నేఁతదలంచితి యేని సత్కృపా
పరచిరకారి నాఁబరఁగుభాసితనామము సార్థకంబగున్॥ 36

ఆ॥ నాకు పాతపంబునకు నింద రాకుండ
దురితభయము నిన్నుఁ బొరయకుండ
నెమ్మిఁ జేసితిన్న నీచిరకారిత
సకలభూతములును సంస్తుతింప॥ 37

వ॥ అనుచుం జనుదెంచి నివాసంబు ప్రవేశించినంగని
చిరకారి నిజకరంబుననున్న వధసాధనంబు డిగ్గవిడచి యగ్గౌతమ
వంశవర్యచరణంబులు శిరంబునోఁకఁ బ్రణామంబు సేసెం బత్ని
యుంజాఁగిఁ మ్రొక్కె నయ్యిరువురనెత్తి శోకబాష్పంబు లానం
దాశ్రువులుగా నమ్మునివరుండు దనయుని గాఢాలింగనంబును
మూర్ధఘ్రాణంబునుం జేసి దీవనలం బొగడ్తలనభినందించి
దానును వారును సుఖాసీనులై యుండి యిట్లనియె. 38

క॥ కార్యవిచారము చిరముగ
ధైర్యముతో నడపవలయుఁ దత్క్రియలం
దార్యుఁ డనార్యుఁడు వీఁడని
యార్యులు సేయుదురు నిశ్చయమును జిరముగన్॥ 39

క॥ మిత్రత్వము శత్రుత్వముఁ

బాత్రత్వము నపాత్రతయును బరికించు సుచా
రిత్రుఁడు చిరతరగణనా
సూత్రితముగ దానవెల్ల శుభములునొందున్॥ 40

వ॥ అని నిర్దేశించె నట్లా చిరకారి చిరకారిత్వంబు సఫలత్వంబు నొంది వినుతింబొందె. 41

• భీష్ముఁడు ధర్మజునకు దీర్ఘదర్శి మొదలగు మత్స్యముల తెఱంగెఱిఁగించుట. •

వ॥ దీర్ఘదర్శియుఁ బ్రాప్తకాలజ్ఞుండును దీర్ఘసూత్రుండును నను మత్స్యంబులు మూఁడుజలచరబహుళంబగు నొక్కయేటి మడువునఁ దమలోనం బొందుగలిగియుండునవి వేసవి సొచ్చిన దీర్ఘదర్శిదక్కటి రెంటినింగూడం బిలిచి॥ 42

క॥ మడువింకఁగ బాతెను నీ
రెడ్రతెవ్విన నొండ సోటికేఁగఁగ రాదె
ప్పుడు నింకని నీళ్ళుగల
మడువునకుం బోవవలదె మనకిట్టియెడన్॥ 43

తే॥ అనినఁ బ్రాప్తకాలజ్ఞుఁడిట్లనియె నేది,
ప్రాప్తమయ్యె నకార్యంబు భంగి నెఱిఁగి
యప్పటికిఁదగునట్లు సేయంగవలయు
మానితోపాయవృత్తి నే మఱుట లేక॥ 44

వ॥ అనిన నయ్యిరు దెఱంగులపలుకులు విని దీర్ఘసూత్రుండిట్లనియె. 45

క॥ జడనిధిచందంబున ని
మ్మడువొప్పఁగ నిప్పుడేమిమాడెనె యిప్తె

నడిచిపడ రిత్త నెవ్వగ
లుడుగుడు మఱిచూచుకొందమొయ్యనతఱితోన్॥ 46

క॥ అనుటయు నిఖికర్జముగా
దనిపల్కును దీర్ఘదర్శియంబుస్రోతతో
జనితాభయమగుపథమునఁ
జనిచొచ్చెం బెద్దమడువుసమ్మదలీలన్॥ 47

వ. తక్కిన రెండును నందనిలిచెనిట్లు నిలిచినయమ్మత్స్య
ద్వయంబునకు భయంబు జనియింపం గతిపయదివసంబులకు.

క॥ పాతెడు నీరెడ తెవ్వఁగఁ
దాఱబెడిదమైనయెండ దనుకఁగ నివురం
బాఱె మడువంత వేడుక
కాఱులుజాలరులు సొచ్చికిందుకొనంగన్॥ 49

క॥ వెరవునసూఁతలనె త్తెలఁ
గరములమత్స్యములఁబట్టి కడుసంతసముం
బొరయుచుఁద్రాళ్లంగ్రువ్వఁగఁ
గరమూహించి మదిఁబ్రాప్తకాలజ్ఞుఁడనున్॥ 50

క॥ ఇందొకతాడుగఱచి యే
నొందంగాఁ గ్రుచ్చినట్లయుండెద వీరి
క్రిందుకొనుటమానంగ న
మందత సదియెడలవిడిచి మనువుదఱిసెదన్॥ 51

క॥ అనియొకగుదివిగాఁనడుమ
నెనయంగా దూఱికఱచి యిరుదాడలఁద్రా

డొనరంగబట్టుకొనికు
చ్చినచందముదోఁప మూర్ఛఁజెందినభంగిన్॥ 52
వ॥ ఉన్నంత వేఁటగీటి యగ్గుదిగఁలయతండు॥ 53
క॥ తెలిసీటరొంపిపీవం
దొలుచు నెడంద్రాడువిడిచి దురితంబునకుం
దొలఁగిపొరదప్పియందొక
జలచరమున్న యెడ కేఁగె సంభ్రాంతగతిన్॥ 54
క॥ ముట్టఁబడిదీర్ఘసూత్రుం
డిట్టట్టుఁగఁగ నుపాయమేదియొకనిచేఁ
బట్టువడెఁదనదుడెందము
పట్టుగదలజనితవికల భావేంద్రియుఁడై॥ 55
క॥ వినుజాదప్పులఁగార్యము
గనికొనివలయుపని మున్న కావింపఁగ నే
రనిజడుఁడు దీర్ఘసూత్రుం
డను నమ్మత్స్యంబుభంగి నాపదనొందున్॥ 56
తే॥ అప్పటికిఁదోచినట్టులు దప్పకుండ
ననువుతోధృతిగల్గి కార్యంబునడపు
నతఁడు ప్రాప్తకాలజ్ఞాఖ్యునట్లపోలెఁ
బరమసంశయమయ్యెడు బ్రదుకుగాంచు॥ 57
క॥ ధుర్యతననాగతములగు
కార్యములూహించి పనితగం జేయునయా
చార్యుఁడు సౌఖ్యముఁబొరయును
నార్యస్థితి దీర్ఘదర్శియనుమీనుక్రియన్॥ 58



ఓం

శ్రీమత్పరదేవాతాత్మైనమః.

# నీతిపద్యరత్నావళి

(రెండవభాగము)

• భీష్ముఁడు ధర్మజునకు పవనశాల్మలీతరు సంవాదంబు సెప్పుట •

సీ॥ అనివినతుండగు నాధర్మసుతునకు
ముదమునఁ జెప్పి భీష్ముండు మఱియు
నిట్లనునిది యొక్క యితిహాసమధిప యా .
కర్ణింపు హిమవన్నగంబునందుఁ
గలదొక్క బూరువు గడుఁ బెద్దకాలంబు
ముదుపశాఖాశోభిమూలదృఢము
నారదమునియొక్క నాఁ డత్తరువుపొంతఁ
జనిచని వేడ్క నిట్లనియె నెమ్మి
తే॥ బూరువా యింతపఱపును బొడవుఁగల్గి
నీవు మృగపక్షిసంశ్రయణీయమగుచు
నునికిగని ప్రీతినడిగెద ననిలు చేతఁ
బడునొకప్పుడు తరులు నీపడమియెట్లు॥ 1

కం॥ పవనునకును నీకును బాం
ధవముగలదా యతఁడు నిన్నుదయ రక్షింపన్
సవినయవృత్తిని బ్రదికితొ
చెవులకు నింపెసఁగ నిజము సెప్పుమునాకున్॥ 2

కం॥ అనినవిని బూరువిట్లను
ననిఁపని బల మస్మదీయమైనబలముతో
నెనగా దెవ్వడ విను పదు
గాలిమిదియగు నంశమునకు నేనద యరయఁగన్॥ 3

వ॥ అని పలుకుటయు నమ్మునీంద్రుండు॥ 4

ఆ॥ అమ్మచెల్ల యిట్టులనకుము కొండలు
లోనుగాఁగఁ బవనుచేనపాస్త
మహిమగలుగు జెట్టుఁగు మాభూతములచేష్టి
తములు వాయువశగతములుగావె॥ 5

కం॥ అనుటయుఁ బెలుచనియెలుఁగున
ఘనమూల ప్రబలశాఖకాదుర్జయున
న్ననుదాఁకిన నతనిప్రభం
జనుఁడను నామంబునకు నసత్యతవచ్చున్॥ 6

వ॥ అని గర్వంపుమాటలాడిన యాశాల్మలిం జూచి
సురముని ప్రవరుండు॥ 7

చ॥ మఱువకయుండు నీబిరుసుమాటలు నీవిటులుంటమారుతుం
డెఱిఁగెడు నెట్లునంచు వెసనేఁగి సమస్తముఁ జెప్పనాతఁడే
తైఱజనుదెంచి నీవశె కడింది మగండవు నిన్నుఁదాఁకినం
జెఱుతఁ బెపేరు బూరుగ నశించితిగాకిట పల్కులేటికిన్। 8

మ॥ అనికోపంబున బల్కి నప్పవనుతో నాభూరుహంబింత పె
ల్చిన నీవాడెడునంత తక్కువని బేలా లోకసామాన్యవృ
త్తునికాయంబును నన్ను నొక్కటిగ నిచ్చంజూచి తేయన్న న
ల్లనినవ్వొప్పఁగ నాసమీరణుఁడు హేలాస్ఫారుఁడై
యిట్లనుఁ॥ 9

కం॥ ఒకనాఁ డజుండు నీ నీ
డకు డబ్బాటరుగుదెంచుటయున మ్మోలా
త్మకు వేఁగై హున్నించిన
మెకమెకపడితిట్ల పలుకుమీతగ రేపున్॥ 10

వ॥ అనిపలికి బలుమొగంబుతోడం బోయిన నబ్బూరు
వుదలంకి॥ 11

చ॥ మనుగడదప్ప నొక్కొ మునిమాటలుగ్రైకొనకైతి నాబలం
బనసదియెంత యుగ్రితమహాబలురాకకు నోర్వఁజాలనా
తనినొక భంగిగెల్తునని తాఁదలపోసిహరించె నాకులుం
గొనలును జొంపముల్ నిడుదకొమ్మలు రేయగుదుఁ
రయంబునఁ 12

వ॥ అట్లు తన్నుందాన విఱుచుకొని యున్నంత వేగు
టయు॥ 13

చ॥ప్రతినకు నీడుగాభయదభంగిఁ బ్రభంజనుఁడేగు దెంచియా
క్షితిరుహాముంగనుంగొని యిసీ యివినాపని నీవచేసితీ
ధృతిమతిసంతసింపుమిట తేజముఁబొందుము నీదుబాంధవ
ప్రతతికి నివ్విధంబు సదుపాయము మేలెఱిఁగింపు
పెంపునన్॥ 14

వ. అని యుల్లాసంబాడి సముల్లసద్గతి నాసదాగతివని యొనట్లు శాల్మలిపవను చేత భంగంబునొందివగంగుం దేఁబ్రిబలునితోడ దుర్బలుండు దొడరి మత్సరగ్రస్తుండయిన నపాస్తవిభవుండగునని తెల్పు నప్పవనశాల్మలీ సంవాదంబు పుణ్యప్రదంబయిన యుపాఖ్యానంబు. 15

సీ॥ పఙ్కజనాభాయ సఙ్కర్షణాయ శాన్తాయ
విశ్వప్రబోధాయ భూత
సూక్ష్మేన్ద్రియాత్మనే సూక్ష్మాయ వాసు
దేవాయ పూర్ణాయ పుణ్యాయ నిర్వి
కారాయ కర్మవిస్తారకాయ క్షేత్రపాలాయ
త్రైలోక్యపాలకాయ
సోమరూపాయ తేజోబలాఢ్యాయ
స్వయంజ్యోతిషే హరన్తాయ కర్మ
తే॥ సాధనాయ పురాపురుషాయ యజ్ఞ
రేతసే జీవతృప్తాయ పృథ్వీరూప
కాయ లోకాయ నభసేఽన్తకాయ విశ్వ
యోనయోఽపిష్ణవే జిష్ణవే నమోఽస్తు.

